# విషయసూచిక.

# ఉపోద్ఘాతము.

---

ప్రతిసంవత్సరమును దేశీయమహాసభలు జరిగినపిదప సంఘసంస్కరణ సభలు జరుపఁబడుచున్నవి. ఈ సభలలో నుపన్యసించువారు చాలమంది కలరు గాని యట్లాచరించువారు తక్కువమందియే యయియున్నారు. అట్లు సంచరింపనమకట్టిన వారిలోఁ గొందరు హిందూమతకులాచారముల ననుసరింపని వారుగ నున్నారు. కావున నిందువిషయమయి బాగుగఁజర్చించి యేవి మనమతపద్ధతులకు విరుద్ధముగాకుండ నుండునో చూచుకొని నిర్ణయింపవలసియున్నది. సంఘసంస్కరణము లనేకములు కలవు. వానిని విచారింపక పూర్వము మన గృహములలో జరిగెడు దురాచారములను బోగొట్టుకొని సంఘసంస్కరణమునకుఁ బ్రయత్నింపవలసియున్నది. మనగృహదురాచారములలోఁ గొన్ని ధనవ్యయములు, మఱికొన్ని యనారోగ్యకరములు, మఱికొన్ని యందముగానివియు నయియున్నవి. వీనిలో మనకుఁ దెలిసివచ్చినవానిని ముందుగఁ జర్చించి చూచెదము.

---

శ్రీ కృష్ణ.

# సంఘ సంస్కరణోపన్యాసము.

---

## ఏ కా ద శి.

ఈ యేకాదశి యాచరణవిషయమున ద్వైతాద్వై విశిష్టాద్వైతులనియెడు త్రిమతములవారిలో స్వల్పభేదవ పెట్టుకొనుటవలన నప్పుడప్పుడేకాదశినాఁ డావ్రతమును వ ద్వాదశినాఁడు చేయుట జరుగుచున్నది. హింసువుల మగ ము ఏకదినమున నీవ్రతము చేయుట సముచితము. అద్వై ద్వాదశివృద్ధివచ్చినయెడల నేకాదశినాఁ డావ్రతమును జే ద్వాదశినాఁడు పారణచేయుదురు. ద్వాదశి పారణయగ యేకాదశినిబట్టి వచ్చినదికాని ద్వాదశివృద్ధినిబట్టి యేక వ్రతము చేయఁదగినదికాదు. విశిష్టాద్వైతులును ద్వైతు దశమినాఁడు రాత్రి తెల్లవారుటకుముందు నరునగనా ఆరుమొదలుకొని యేకాదశిగడియలు సంభవించినయెడ మీవిద్ధయని యేకాదశినాడు వ్రతముచేయక యేకాదశి యులేని ద్వాదశినాడు చేయుచున్నారు. విష్ణ్వాలయము తదితరతిధులకు సూర్యోదయవేళకు గలప్రతితిథిని నాతి దనే యాచరించుట సంప్రదాయసిద్ధమయి యున్నది. ధులకు విద్ధదోషమును గమనించుటలేదు. కావున సూ




శ్రీకృష్ణ

# సంఘసంస్కరణోపన్యాసము.

శ్రీకృష్ణదాస

విరచితము.








संघ संस्करणोपन्यासम्

చెన్నపురి:

ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనివారిచే

ఆనంద ముద్రాలయమున

ముద్రింపఁబడి ప్రకటింపఁబడిరి.



1919

వేళకు నేకాదశితిథిగలదినమే యీవ్రతమునకు ముఖ్యమని ందరును గ్రహింపవలెను.

---

## ఉపవాసము.

ఈ ఏకాదశివ్రతమునకేగాక తదితరవ్రతములకు సహా వాసముచేయుట యద్వైతులలో గలదు. గృహస్థులకేక క్తను చేయవలసినదనియు సన్న్యాసులు, విధవలు, నుపవా ం చేయవలసినదనియు విధిగలదు. ఈవిషయము శాస్త్ర్యయోచించినను బదిహేను దినములకొకసారి యేకభుక్త చేయుటవలన నారోగ్యము గలుగుటలో సందేహము లేదు. వాసముచేయుటవలన సన్న్యాసులకు విధవలకును శరీరదా ము తగ్గి యింద్రియములు శుష్కించుచుండును. ఈయుప గమును గమనింపలేక గృహస్థులు కొందరుపవాసము సుచున్నారు. అట్లు చేయుటవలన నావెంబడినే సంతానో త్తిగలవారిబిడ్డలు దృఢగాత్రులు గాక యుందురు.

---

## భగవద్ధ్యానము.

మనలో ననేకులు భగవంతుని నర్చించుటలోగాని ధ్యా నుటలోగాని విశేషకాలమును వినియోగపరచుచున్నా అట్లు చేయుటవలన నితరము లగుమంచిపనులు జరుపబ నిలిచిపోవును. కావున యుక్తప్రవర్తనము గలిగి తగుసమ ములలో బూజించుచు ధ్యానించుచు తరింపవలెను.

---

## అపరకర్మలు.

ఈ కర్మలనునవి యనేక మతములయందు నేదో విధముగ జరుపబడుచున్నవి. ఇందు ప్రత్యాబ్దికములు మా మనహిందూమతస్థులలోనే చేయబడుచున్నవి. అరుదు దరు క్రిష్టియన్ ప్రభువులు తమపూర్వుల మృతతిధినాడు యములకుబోయి యొకవిధముగు ప్రార్థనచేయుట గలదు. కర్మలు విధికృతకర్మలుగావున నందులవిమర్శమును మా మతప్పకి జరిగించుచుండవలెను. ఈకార్యము లాచరించ వివాహాదిశుభకార్యములకంటె హెచ్చుగ సంభావనలు, ణములు, దానములు జరిగించుచున్నారు. కొన్ని సంస్థానవ డవహానకర్మనాడు వివాహకార్యమునకంటె భూరిసంభా చ్చుగ నిచ్చుచున్నారు. గతించినమనుష్యుడు తాను జేసి చినపనులవలన నాజీవునకు సద్గతికలుగవలెను. లేదావిధిక్మ కర్మలలోచేయు తర్పణపిండదానాదులవలన సద్గతి క గినగలుగవచ్చును. కాని విశేషమైన సంభావన సంతర లవలన ప్రయోజనము గానరాదు.

---

## ధర్మకార్యములు.

శ్రీజగన్నాథాది దివ్యక్షేత్రములయందు అనేకుల లవలనను ధనికులవలనను దేవతారాధనలు జరుపబడు ఆక్షేత్రములయందు నాధర్మములు జేయుపుట కేర్ప ధర్మస్థాపకులుగాని వారివంశజులుగాని వచ్చినపుడు వ జేరుపుచు నితరదినములలో వాని నెంతమాత్రము

।ద్రవ్యమును కేవలము వారిపోషణమునకే యుపయోగిం
చనుచున్నారు. కొందరాయసందర్భముల గనిపెట్టి వానిని
యు, స్వస్థలములకు మార్చియునున్నారు.

---

## అన్నసత్రములు.

ఇవి పూర్వకాలమునుండియు ననేక దివ్యక్షేత్రములలో
కులచేత స్థాపింపబడియున్నవి. క్షేత్రములయందే కాక
పరులు, ధనవంతులును ప్రయాణికులకొరకు రస్తాలవెంబడిని
క సత్రములను స్థాపించియున్నారు. అంతియగాక వారివారి
లములయందును స్థాపించియున్నారు. స్వస్థలములయందు
పబడునవి కొంతవరకు యుక్తముగ నడుపబడినను సోమరుల
ణను ప్రోత్సాహపరచుచుండును రస్తాలవెంబడి నున్న
లో నాధర్మము చక్కగ జరుపబడుటలేదు. ఇప్పుడు,
పదారి (రైల్వే) పడిన పిదప రస్తాలవెంబడి సత్రములు
పోయినవి.

---

## విద్య

ఇపుడింగ్లీషుబడులయందు చెప్పబడు సాధారణములగు
వులయందును సర్వకళాశాలాపరీక్షలకు బోవుటకయి నే
ను విద్యలయందును మనమతవిషయము లేమియు గరపబ
లేదు. క్రిస్టియను మతసంబంధములైన పాఠశాలలలో నా
విషయము చక్కగ జెప్పబడుచున్నది. హిందువులకును,

మహమ్మదీయులకును వారివారి మతవిషయము లేల నేర్ప
గూడదు. అందుకుగాను మనము శ్రీదొరతనమువారిని ప్రార్థి
వలసి యున్నది. మఱియు బాలికలు రజస్వలలగుటకు పూర్వ
మాత్రము చదువుటవలన వారికిగరపు విద్యచాలక యున్న
రజస్వలానంతరము చదువుకొనుటకు నాక్షేపణలేని స్త్రీయు
ధ్యాయులచేతనే నేర్పింపబడు బాలికాపాఠశాలలు జిల్లాకొక
యయిన నుంపించుమని మనము శ్రీ దొరతనము వారిని ప్ర
ర్థింపవలసియున్నది.

---

## సంతర్పణములు.

ఇవి శుభాశుభ కార్యముల సందర్భమునుబట్టి మన
హెచ్చుగ జరుపబడుచుండుటయేగాక యొకరితో నొకరు పో
కగాను, జనసంఖ్యను, పిండివంటలు లోనగుపదార్థముల సంఖ
నుహెచ్చించుచు బోవుచున్నారు. ఇందువలన విశేషముగ
వినియోగ మగుచున్నది. కార్యసందర్భమును బట్టియు, తన
గతులను బట్టియు మాచుకొని యీ సంతర్పణవ్యయము
తగ్గించుట మేలుగ దోచుచున్నది.

---

## వివాహసంబంధములు.

ఈ విషయములో దేశభేదమునుబట్టి నానావిధములు
జరుగుచున్నవి. అందుగొన్ని ముఖ్యాంశము లిచట పొందుప
పబడును. సమిష్టికి రక్తసంబంధమునిందుదూరముగ గ

వారు వివాహమాడుట శ్రేష్ఠతనము. అందునుండియె మేనరికము దూష్యమైనది. ఏలయనిన — తాను నతనసహోదరియు నేకగర్భజనితులగుటవలన నమయిరువురి రక్త సంబంధము నొకటియె. అట్టివారిబిడ్డలసంబంధమును నించుమించుగ నేక విధముగనుండును. తనసోదరీపుత్రిక రక్తమూతనరక్తమయియె యున్నది.

కావున నాబిడ్డను నతపుత్రునకు జేసికొనుటలో నాక్షేపమెక్కువ. తక్కువ జాతులవాండ్రు కొందరు సోదరీపుత్రికనే వివాహమాడుటగలదు. ఇదికూడ దూష్యము, ఏలయనిన-ఏకగర్భజనితు లగు వారబిడ్డ లితరేతరము స్వసృతానములో లెక్కింపబడవలసియున్నది. అందువలన నేకమా-సోదరులబిడ్డ లితరేతరము స్వసమానులుగను సుమాత్రులుగను భావింపబడుచున్నారు. ఈరక్తసంబంధమును యోచించుటచే మహాత్ములీయులలో సోదరులబిడ్డలు పరస్పరము వివాహము జేసికొనుటకిలదు. అనగా తనభార్యయు తనసోదరునిభార్యయు వేరువేరు గర్భములయందు వసించుటవలన వారిగర్భములలో బుట్టినశిశువులకు రక్తసంబంధము మేనరికముకంటె దూరమైయుండుననియిట్లేర్పరచుకొనిరి. ఇది బాగుగాని గోత్రాదులుగల మనహిందూమతస్థులకాచరించుటకు వీలులేదు. రక్తసంబంధము దగ్గఅయి, వివాహమాడుటవలన వారలకు బుట్టిన బిడ్డలు తల్లిదండ్రులతో పాటయినను దృఢగాత్రులుగా నుండజాలరు. కావున రక్తసంబంధము నిండుదూరముగ గలవారుగాని లేనివారుగాని వివాహములు చేసికొనుటకు కనిపెట్టుచుండవలెను. ఈసందర్భములో కన్యలవిషయమున నొకయసందర్భపుటా

చారముగలదు. అది యేదియన-మనలో కన్యప్రథమరజస్వల యగునపుడు మేళమువాయించుటయుబంధువులను బరిచితులను వేడుకతో వెళ్లి పిలుచుటయు జరుగుచున్నది. ఇది సంసారులకు మర్యాద యగుపని కాదు. ఏలయనిన వేశ్యాకన్యరజస్వల యగునపుడు మేళము వాయించుటవలన నాకన్యరజస్వలయైన దని నలుగురికిని తెలిసి దానికి లాభముకలుగును. సంసారుల పిల్ల రజస్వల యైనపుడు పదిమందికి దెలియనవసరము లేదు. కావున నిటమీద నిట్టి సమయములలో తప్పక పిలువదగిన బంధుస్త్రీలను నిరుగుపొరుగు స్త్రీలను మాత్రము బహిరంగము గాకుండ బిలుచుట యుక్తముగనుండును.

---

### మఱికొన్ని విషయములు.

#### చెవులుకుట్టుట.

మనలో పిల్లలకు చెవులుకుట్టుటకలదు. ఇది చేయతగిన కర్మలలోనొకటి యగుటచే తమ్మెలుకుట్టించుకొనవచ్చును. స్త్రీలకు మీదచెవిని ఒకటిరెండుకుట్లు కుట్టించుకొనినచాలును. అట్లుగాక తురుష్కాచారము ననుసరించి యుత్తరదేశములో హెచ్చుగకన్నములు కుట్టబడుచున్నవి. దక్షిణదేశములో తమ్మె కన్నములను నెంతవిరివిగ జేసిన నంతయందమని భుజమునకు దగులునంత వ్రేలబడువఱకు రంధ్రములను భారములు గట్టిపెంచుచున్నారు. ఈదురాచారము ఓఢ్రులలో కొంతవఱకు బురుషులుగూడ ననుసరించుచున్నారు. మళయాళదేశములో స్త్రీలు తమశిఖలను బహుఅందమగు విధముగ శిరస్సుమీద ముడి

వేయుచున్నారు. అట్టివారుగూడ తమ్మెరంధ్రములు పెంచు టయు మీద చెవికి భారమగునట్టియు. విపులమగునట్టియు నాభరణములను ధరించుచుందురు. అది యందముగ లేదు.

మన దేశములో స్త్రీపురుషులు అందుమెందుగ నాడువారు నలుపు, నీలి, ఎఱుపు, గులాబీరంగులుగల కప్పులు దంతములకు వేయుచున్నారు. ఈకప్పులు వేయునప్పుడు చిగురులు వాచి విశేషబాధపడుటయేగాక పండ్లకు స్వాభావికముగ గలుగుమురికిని బోగొట్టలేక యనారోగ్యహేతు వగును. ఈకప్పులు అందవికారముగనుండుటలో సందేహము లేదు. కొన్ని కుటుంబములలో వివాహకాలమందు దంపతులకు కప్పువేయుట గలదు. పండ్లకు గప్పువేయుట యిప్పటికాలమున ననాగరికముగ నెంచబడును.

---

## నాసికాభరణములు.

మన దేశములో హిందూమహమ్మదీయ స్త్రీలు నాసికకు మూడుకుట్లుకుట్టించుకొనుట గలదు. పిల్లలకు నెల లోపుననే కుట్టించికాడలు వేయుచున్నారు. ఇది బాల్యమునందు జరిగించుటలో నాపిల్లలకు నసౌఖ్యకరముగ నుంటున్నది. ముక్కుకు మూడుకుట్లు కుట్టుటయేకాక, యాభరణములు అనగా-నత్తు, బులాకీలు బహుఅందవికారముగాను అసౌఖ్యకరముగాను నుంటున్నవి. మహమ్మదీయ స్త్రీలుంచుకొను బులాకీలు భోజనము చేయుటకు సహా అడ్డమగు నంతవఱకు వ్రేలబడియుండును. ఇప్పటి నాగరికతను బట్టిచూడగా ముక్కునకుకుట్లు లేకయుండుట మేలు. మన దేశములో కొన్ని ప్రదేశములయందు మగ

పిల్లలకు సహా ముక్కుముందు కుట్టుటకలదు. ఈయాచార మెట్లు వచ్చినదో తెలియదు. ఇప్పుడట్లు చేయుట యనాగరికత క్రింద నేర్పడుచున్నది.

పిల్లలు పెద్దవారయిన పిదప తీసివేయుటగలిగి యున్నను గొందరు మగవారు తత్రాపి గోదావరి కృష్ణ కొంతవఱకు విశాఖపట్నము జిల్లాలలోని గొల్లవాండ్రు పెద్దవాండ్రయినను చనిపోవువఱకు ముక్కుముందుకమ్ములుంచు కొందురు. ఇది బహు అసహ్యకరముగ గనిపించుచున్నది.

మఱియు హస్తములయందు స్త్రీలకు పచ్చబొట్లు పొడిపించుటగలదు, ఇది బాగుగలేదు. అందవిహీనము గూడనై యున్నది.

---

## —••◆ హస్తాభరణములు. ◆••—

హస్తాభరణములు నిర్ణయమైన లెక్కలేక స్త్రీలకు ఉంచుచున్నారు. లంబాడీలు, హీనజాతులలో గొందరును మణికట్టు మొదలు మోచేతివరకు నుంచుటగలదు. ఇది ఏమియు బాగుగలేదు. మొత్తమునకు చేతియొకటింటికి నొకజతయుంచి ననందముగ నుండును. పాదములకు గూడ స్త్రీలు నాలుగైదు వరుసలవఱకునుంచుట గలదు. ఇదియుబాగుగలేదు. కడ్డీలవలె జేయబడిన వన్నియు మాని పాదమున కొకటిచొప్పున గొలుసులవలె సన్నగచేయబడిన పంజీవులవంటివి యుంచుట యందముగనుండును. అట్లనే కాలివ్రేళ్లకు సుతరాము పొట్టెలను మానుటయో పెట్టవలయునన్న వారు బొట్టనవ్రేలి ప్రక్క

ప్రవేలికిసన్నమగు నోటి చొప్పున నుంచిన నందముగను సౌఖ్యముగనుండను. పైని గనబరచినదురాచారములు నాకు దెలిసినంతవఱకు ఎత్తిచూపితిని. దేశవిభాగములనుబట్టి మఱికొన్ని యిట్టివంటివి యుండవచ్చును. వీనినన్నిటిని ముందుగ సవరించుకొని సంఘసంస్కరణ విషయములో చర్చించి పరిష్కరించుకొనవలసి యున్నది.

---

(Degeneration) జనసామాన్యముయొక్క క్షీణదశ.

మన తాతతండ్రులను బట్టిచూడగా మనహిందువులలో-తత్రాపి మదరాసు రాజధానివారి శరీర దార్ఢ్యములో క్రమముగ క్షీణించుచున్నారు మఱియుమగివారికిప్పుడు మీసములపుష్టి క్రమముగ తగ్గుచున్నది. ~~క్షీణించుచున్నారు~~. చాలమంది పిల్లలకు దూరదృష్టిలేక దూరదృష్టి యద్దములను వేయుచున్నారు. మగబిడ్డలకును ఆడుబిడ్డలకును బాల్యమునుండియు తలవెండ్రుకలు నెఱయుచున్నవి. ఆడుబిడ్డలకు (Hysteria) హిస్టీరియా,మూర్ఛలు మెండగుచున్నవి. ఇట్టివాని కనేక కారణములుండ వచ్చును. సాధారణముగ దెలియవచ్చినవి ఎవ్వియన:

1 శరీరపరిశ్రమ లేకపోవుట. 2 మంచిభోజనము చేయక పోవుట (3) త్రాగుట (4) బాల్యవివాహము (5) వయసుతగిలినమీఁద బ్రహ్మచర్యమును సరిగ నడపుటయందు దృష్టి యుంచకుండట (6) అతి స్త్రీవ్యసనము-లోనగునవిగా గానవచ్చుచున్నవి.

మునుపటివలె గాక ఇప్పుడు బదులలో (Gymnastics) జిమ్నాస్టిక్సు, సాములను, పరుగెత్తదగునాటలను జెప్పుచు న్నారు. ఆబడులనువిడచినపిదప నిప్పటివారు శరీరపరిశ్రమ నే చేయరు. గుఱ్ఱము నెక్కుట ప్యాసుఅయినపిదప నాయాయుద్యో గములలో ఖాయపరచుట ప్రభుత్వమువారి నిర్ణయమయి యుండినను మనహిందూ ఆఫీసరులు విధిలేక గుఱ్ఱమునుంచు కొన్నను దానిపయిని సవారుచేయక లాంఛనమునకు మాత్ర ముంచుకొనుచున్నారు. పూర్వము సాధారణ పట్టణములయం దును గరిడీలు అనగా సాముచేయుశాలలు, వానిననుసరించు బయిలు స్థలములు నుండెడివి. అవి ఇప్పుడెచ్చటను గానరావు. బలమును గలిగించుభోజనమునం దిప్పటివారికి దృష్టిలేదు. మంచి యుడుపులమీదను, త్రాగుటయందును, చుట్టలు మొద లగునవి కాల్చుటయందును, పొగాకుతో చేయబడిన కిళ్లీలను బీడీలను వేసికొనుటయందు నాసక్తులయి యున్నారు. మితముగ త్రాగినను మంచి భోజనము ఉండవలెను. అమితముగ త్రాగి బలము నీయని యాహారము దినుచున్నారు. పదునెనిమిది వత్సరములు వెళ్లువరకు కాల్చకూడదని వైద్యులు దృఢముగ జెప్పుచుండి నను అతిబాల్యమునుండియు చుట్టలను త్రాగుటయు నాపిదప సిగరెట్లను, బీడాలను దఱుచుగవాడుకచేయుటయు జరుగు చున్నది.

బాలురకు పూర్ణవయస్సు రాకపూర్వమే కాపురము చేయదగిన కన్యలకు వివాహము చేయుచున్నారు. అందువలన నట్టివారికి స్త్రీవ్యసనము హెచ్చుగదటస్థమగును. భార్యకాపురము నకు వచ్చులోపలగూడ మగపిల్లలు బ్రహ్మచర్యమును సరిగా

నడపుట లేదు. కళాశాలాపరీక్షలకు బోవువారాపరీక్షలయందు గృతార్థులయిన పిదపనే వివాహముచేసికొనవలెను. తాతతం డ్రులను బట్టిచూడగా శరీరదార్ఢ్యాదులు క్షీణించుచున్నందుకు నాకు తెలిసియున్నంతవరకు వ్రాసితిని. ఇది గృహస్థులలోని దురాచారములకంటెను సంస్కరణములకంటెను ముఖ్యమయినవిషయముగావున నందరునుగలిసి బాగుగ యోజించుకొని సంఘాభివృద్ధి యగునట్లు జాగ్రత్తపడవలెనని కోరుచున్నాను.

---

## కన్యావరశుల్కములు.

కన్యాశుల్కము నిచ్చికొనగూడదనియు నట్లుగొనికొని యిచ్చినపిల్ల దేవపిత్రుకార్యములకు బనికిరాదనియు న్యాయతః ధర్మపత్నియని లెక్కింపదగదనియు మనశాస్త్రములో ఘోషించి చెప్పబడియున్నను, నీదురాచారము బ్రాహ్మణులలో ముందుగనారంభింపబడినది. ప్రారంభములో నట్లు కన్యాశుల్కమును దీసికొన్నవారిని ఇతరులు విశేషముగ దూషించుచుండిరి. ఇప్పుడు సాధారణముగ నీదురాచారము జరిగిపోవుచున్నది. ఇపుడు బ్రాహ్మణులలోనే కాక ఇతరజాతులలోను తత్రాపి మర్యాదగల జాతులలోగూడ జరుగుచున్నది. ఇదిశాస్త్రదూషితము గావున దీనిని మనవారు మానుకొనవలెను. ధనవంతులలో వరునకు కట్నమను పేరుతో శుల్కమునిచ్చి యాడుపిల్లలను వివాహములు చేయుచున్నారు. వరదక్షిణకాని, వరాలంకారాదులుగాని కన్యాదాతలయొక్క స్థితిగతులను బట్టియు, సంతోషమునుబట్టియు, జరుగదగియున్నది. అట్లు కాక

కన్యాశుల్కమువలెనే వివాహోత్పూర్వము బేరమాడి తీసి కొనుద్రవ్యము వరశుల్కమయి దూష్యమయి యున్నది.

---

## నాడిభేదము.

బ్రాహ్మణులలో నాడిభేదమనునది శాస్త్రములో జెప్ప బడినదికాదు. నాడు అనగా దేశము అనియర్థము. వేరు వేరు దేశములయందు నివసించువారి కాదేశములనుబట్టి వేగినాడు, వెలనాడు, మొదలగుపేరులు వచ్చియుండును. ఇప్పు డాదేశ విభాగము లెచ్చటను గానరావు, ఇప్పుడానాడిభేదములు గల వారలు ఒక్కొక్క గ్రామమందును, నొక్కొక్కపట్టణమం దును పెక్కుమందిగలరు. కావున నిప్పుడా భేదములుండ నవ సరములేదు. మఱియు మనవేదములననుసరించి ఏర్పడిన వేరు వేరు శాఖలవారే పరస్పరము వివాహసంబంధములు చేసికొను చుండెగా మధ్యకల్పితము లయినట్టియు, ప్రస్తుతము విభాగము లేని దేశభేదమునుబట్టివచ్చిన నాడుల విషయమగు నేర్పాటును వివాహాదులయందు బెట్టుకొనక యిటుపయిని బ్రాహ్మణులు వివాహములు జరిగించుకొనుట సముచితము.

---

వర్ణవ్యవస్థ.

## జాతిభేదము.

సృష్ట్యాదియందు స్త్రీ పురుష భేదము తప్పజాతిభేదము లేదని యందరు నొప్పకతప్పదు. క్రమముగ బ్రజలకు జ్ఞానాభి

ృద్ధియయినకొలదిని వస్త్రధారణము, గృహనిర్మాణము, వ్యవ
సాయాదివృత్తులు నావశ్యకములయ్యెను. అటు పిమ్మట మంచి
చెడుగులను దెలిసికొనుచు విద్యలనభ్యసించుటయం దాసక్తు
లై నానావిధవ్యాపారముల యందును ప్రవీణులగుచువచ్చిరి.
అదియే బహుశః వేదకాలమయి యుండును. అందునుబట్టి
వేదములందు మొదట నాలుగు వర్ణభేదములు మాత్రముం
డినట్లు చెప్పబడినది. అవి యెవ్వియనిన:— శ్రుతి. బ్రాహ్మ
ణోస్యముఖమాసీత్ । బాహూరాజన్యఃకృతః । ఊరూతదస్య
యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత ॥ అనగా భగ
వంతుని శరీరములో ముఖమువలన బ్రాహ్మణులును, బాహు
వులవలన క్షత్రియులును, ఊరువులవలన వైశ్యులును, పా
దములవలన శూద్రులును వారివారి వ్యాపారములను బట్టి
యుద్భవించిరని తలంచినట్లు కనబడుచున్నది. ఆ నమ్మికను
బట్టి చూచినను, ఒక శరీరములోని యవయవములకు న్యూనా
ధిక్యము లెంచబడుట కవకాశమే లేదు. అయిన నీ విభాగ
ము నేయుద్దేశముతో దీసికొని యుండు ననగా విద్యావంతు
లగువారి నందరిని బుద్ధికి స్థానమయిన ముఖమునుండి యావిర్భ
వించినారనియు భుజపరాక్రమముచే దేశములను గాపాడుచు
దుష్టశిక్షణ శిష్టరక్షణలచే పాలించుచుండుటనుబట్టి భగవం
తుని బాహువులనుండి క్షత్రియు లుద్భవించిరనియు నమ్మిరి.

వైశ్యులు వాణిజ్యవ్యాపారముచే ప్రజలకు జీవన
వ్యాపారము నడచునట్లు ప్రవర్తించుచుండిరి. శరీరము సుఖ
స్థితిలో చాలకాలముండుటకు కూర్చుండుటయే సాధనమయి
యున్నది. అందునకు నూరువులు ప్రధానము. గ్రామస్థుల

యునికిపట్టున సుఖస్థితికి నీ వైశ్యులచే సంపాదింపబడిన పదార్థములే యావశ్యకములై యున్నవి. కావున వారు భగవంతుని ఊరువులవలన జన్మించిరని పూర్వులు తలంచిరి. శరీర వ్యాపారమునకు పాదములు ముఖ్యమయినట్లు శూద్రులు పై మూడు వర్ణములవారి సమస్త వ్యాపారములకును తదితర కార్యములకును ముఖ్యులై యున్నందున వీరిని పాదములయందు బుట్టినారని మన పూర్వులు భావించి యుందురు.

ఈ విభాగ మెటుల నిర్ణయింపబడియున్నను బూర్వ కాలమున నీ నాలుగు జాతులవారును న్యూనాధిక్యభేదముల పాటింపక జీవించుచున్నట్లు తెలియవచ్చుచున్నది. ఇటీవల గూడ బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు కలిసి మెలసి భోజనములు చేయుచున్నట్లు చరిత్రములలో ననేక దృష్టాంతములు కానవచ్చుచున్నవి. ఇప్పటికిని క్షత్రియులగు తిరువనంతపురపు ప్రభువుల సహపంక్తిని బ్రాహ్మణులు భోజనము చేయుచున్నారు. ఇటీవల నా నాలుగుజాతులలో నుండియు ననులోమ విలోమజాతులని యష్టాదశ వర్ణము లేర్పడినవి. ప్రస్తుతపు హిందువులలో గల జాతులకు సంఖ్యయే లేదు. ప్రథమ విభాగమగు నాలుగుజాతులకు వర్ణములు (రంగులు) నాలుగే యని నమ్మిన కాలములో తెలుపు, యెరుపు, పచ్చన, నలుపు అను నాల్గు రంగులును నలుగురికిని వరుసగ నూహించిరి. ఈయ వివేకమున కేమి. భగవంతునకు గూడ కృత, త్రేతా, ద్వాపర, కలియుగములలో ఈ నాలుగురంగులనే కలిగియున్నట్టు పురాణములలో చెప్పబడియున్నది. భగవంతు డెట్టి రూపము నెట్టి వర్ణముగల వాడో యెవరు చెప్పగలరు ?

ౖవానికే మన పౌరాణికులు, యుగములనుబట్టి రంగును ార్చియుండగ పై నాలుగు జాతులకును రంగుల నెంచుట ాశ్చర్యము కాదు. స్వభావసిద్ధమయిన రంగులు ఏడని ఇప్పటివారికి దెలిసియున్నచో నప్పు డెట్లు లీరంగుల విభా ము చేసియుందురో తెలియదు. అనేక జాతుల విభాగము ర్పడిన పిదప జాతి పట్టుదల పూర్వమునం దెట్లుండినను, మతాచార్యుల కాలమునుండి బ్రాహ్మణులలో గూడ విభా ము లేర్పడినవి. వారిశిష్యులు, వారిశిష్యులును, నొకరికంటె ొకరు హెచ్చువారమను నహంకారముతో పిచ్చి పట్టుదలలు పెట్టుకొని సహభోజన సంబంధాదులయం దనేకములయిన ిక్కులను దెచ్చిపెట్టిరి. ఇట్లు రానురాను పరస్పరము కక్షలు పెరిగి ఒకరికంటె నొకరుత్తములమని యహంకరించుచు నెన్ని ిక్కులు పెట్టుకొన్ననంత గొప్ప యని భావించుకొని యన్ని వర్ణములలోను ననవసరములయిన వైషమ్యములను దెచ్చి పెట్టుకొనుటచే నైకమత్యము చెడి దేశమునకు ననర్థము గలుగుచున్నది.

ఇప్పటి కాలమునుబట్టి పరిశీలించిన యెడల బ్రాహ్మణులు అనగా త్రిమతస్థులవారును, పఙ్క్తి భోజన సంబంధములను నిరాక్షేపముగ జరుపుకొనుటయు నటులనే క్షత్రియులు, వైశ్యులు, శూద్రులును జరిగించుటయు సముచితము, శూద్రులనగా దశ విధ విభాగముగల వెలమలయి యున్నారు. వీరికే పురాణోక్తములయిన సమస్త కర్మలును, జరుపబడుచున్నవి. తదితరుల కవి లేవు. బ్రాహ్మణులు మొదలు వీరందరు నొకరినొకరు స్పృశించుటలోను, దృష్టిదోషమును పెట్టుకొనుట

లోను, పట్టుదల లుంచుకొనగూడదు. హిందువులయ్యును, కేవల శాస్త్రదూష్యమయిన గోమాంస భక్షణము చేయుటచే చండాలాది వర్ణములవారు అంటరానివారుగ నెంచిన నెంచవచ్చును. అయితే గోమాంసమును దిను క్రైస్తవ మహమ్మదీయ పారసీకాది మతస్థు లంటరానివారా యని ప్రశ్నము గలుగును. వారివారి మతముల రీతిని గోమాంస భక్షణము నిషేధింపబడి యుండలేదు. కావున వారి, నంటుట తప్పుగ నెంచగూడదు. ఇప్పటికి పైని గనపరచిన ప్రకారము మనదేశములోనివారు జాతి పట్టుదల నిప్పటివలె నుంచక యుందురని కోరుచున్నాను. కొంతకాలము జరిగినపిదప నప్పటి స్థితిగతులనుబట్టి తిరుగ మఱియొక సంస్కరణము జరిగించవచ్చును. ఇప్పుడు విభాగములతో నున్నవాని నన్నిటిని వెంటనే మానుకొనుమని చెప్పుటలో ప్రయోజనము లేదు. ఇప్పు డట్లు చేయుమని చెప్పువారే కాని యాచరించువారు కానరారు. కావున పైని వ్రాసిన ప్రకారము జాతితో సంబంధించిన సంస్కరణము మాత్రము ప్రస్తుతము అంగీకరించుట యాచరణకు సులభముగ నుండును.

— —

## అసవర్ణ వివాహము (Inter-marriage)

ఇందుకుగాను ఘనతజెందిన శ్రీవైస్రాయ్‌గారి శాసన నిర్మాణసభలో నొకబిల్లు వచ్చియున్నది. లోకమున ప్రతి మతములోనును, నా మత సంబంధమైన పద్ధతులను, నాచారములను ననుసరించి కర్తలు జరుపబడుచున్నవి. అందు హిందూ

ుతిమున నా పద్ధతులు పెక్కుగలవు వానిని మీరి నడిచిన యెడల మనము హిందువులమే కాక పోవలసి వచ్చును. ఇంతియు గాక హిందూ (Law) ధర్మశాస్త్రమంతయు మార్పబడ వలసి యున్నది. అట్లు మార్చుటకు మెయిన్ దొరవంటి ఘను లొక డుండినను మన వివాహాది వైదిక కర్మలలో గోత్ర ప్రవరలను, వర్గత్రయమును జెప్పవలసి యున్నవి గదా అసవర్ణ వివాహ మాడినపు డా గోత్ర ప్రవరలు, వర్గత్రయము చెప్పి నడిపించుట కెవరి తరమును గాదు. కావున నసవర్ణ వివాహ ప్రయత్నములు మాని యాయా వర్ణములలో మధ్య తెచ్చి పెట్టుకొన్న యవాంతర భేదములను విడిచికొని వర్ణ వ్యవస్థలో పైని గనబరచిన ప్రకారము జరిగించుట యుక్తము.

---

## రజస్వలా వివాహము.

మన హిందూ బ్రాహ్మణులలో కన్యకలకు దగిన యీడు రాక పూర్వము సాధారణముగా వివాహములు చేయు చున్నారు. అందువలన వధూవరులకు వివాహపు గట్టుబాటు లేమియు దెలియవు. వరు డనగా కన్యక చేత గోరబడినవాడని యర్థము. కన్యక వివాహములో గౌరీపూజ జరిగిన పిమ్మట మంచి మనస్సుగలవారును, నైకమత్యముగలవారును, మంత్ర మంత్రార్థ జ్ఞానముగలవారునైన నలుగురు బ్రాహ్మణులను నా నిమిత్తము మీరు వరుని వరియింపుడని పంపునట్లు "సుహృదస్సమవేతా" ఇత్యాది మంత్రము చెప్పుచున్నది. ఇందును

బట్టిచూడగా వివాహకాలమునకు గన్యక యెంతవయస్సు గలిగియుండవలెనో చదువరులకే తెలియును.

మరియు స్మృతి గ్రంథములలో గొన్ని రజస్వల యగుటకు పూర్వము వివాహము చేయవలయుననియు, వసిష్ఠస్మృతి అవివాహితయయి రజస్వలయగునేని తండ్రికి దోషము గలుగునసియు, జెప్పుచున్నవి. పరాశరస్మృతి శ్లో॥ ప్రయచ్ఛే న్నగ్నికాం కన్యా మృతుకాలభయాత్పితా। ఋతుమత్యాంహి తిష్ఠంత్యాం దోషః పితర మృచ్ఛతి॥ సంగ్రహకారు డిట్లు చెప్పుచున్నాడు. శ్లో॥ యావచ్చేలం నగృహ్ణాతి యావత్క్రీడతి పాంసుభిః యావద్దోషం నజానాతి తావద్భవతికన్యకా ॥ సంవర్తుడు. శ్లో॥ కామకాలేషు సంప్రాప్తే సోమోభుఙ్తేతు కన్యకాం। రజః కాలేతు గంధర్వోవహ్నిస్తుకుచ దర్శనే తస్మాదు దాహ్వయేత్కన్యాం యావన్నర్తుమతీ భవేత్ ॥ ఇత్యాది వచనములు యావనావిర్భాసమునకు బూర్వమేవివాహమును జెప్పుచున్నవి. ఇక రజస్వలావివాహమును బోధించు ప్రమాణము లెవ్వియనగా-బోధాయనః. శ్లో॥ త్రీణివర్షాణ్యృతు మతీ కాంక్షేతపితృశాసనం। తతశ్చతుర్థే వర్షేతు విందేత సదృశంపతిం॥ అవిద్యమానే సదృశే గుణహీనమపిశ్రయేత్ ॥ మనురపి॥ త్రీణివర్షాణ్యుదీక్షేత కుమార్యృతు మతీసతీ। ఊర్ధ్వంతు కాలా దేతస్మా ద్విందేత సదృశంపతిం। అదీయమానాభర్తార మధిగచ్ఛేద్య దిస్వయం నైనఃకించిదవాప్నోతి నచయం సాధిగచ్ఛతి॥ సాయంభర్తారమధిగచ్ఛతి సోపినైనోధి గచ్ఛతి॥ ఇత్యాదివచనములు। రజస్వలా వివాహమును వచింపుచున్నవి. ఇట్లుండగా శ్లో॥ శ్రుతిస్మృతి విరోధేతు శ్రుతిరేవబలీయసీ అవిరోధేసదాకార్యం స్మార్తం వైది



వత్సదా॥ [illegible] విరోధముకలిగినప్పుడు శ్రుతియే లవత్తరము. విరోధము లేనిచో [illegible] స్మృత్యుక్తాచారము వేద ంతమువలె జేయదగినదని యర్థము, మనుస్మృతి-అ॥ ౨ శ్లో॥ ౧౩॥ యొక్క-టీకను. జూడుడు. అచటనే జైమినిసూత్రము 'విరోధేహ్యన పేక్షంస్యా దసతిహ్యనుమానం'' ఈసూత్రము కు మీఁదవ్రాసినదే యర్థము. పైనివ్రాసినస్మృతి సూత్రము ను బట్టి వేదమూలకస్మృతులకే ప్రామాణ్యమంగీకరించ దగి యున్నది. కాబట్టి యౌవనావిర్భావమునకుబూర్వము కన్యకలకు వివాహముజెప్పుచున్న స్మృతులకంటె యౌవనవతులయిన కన్య కలకు వివాహమును విధించుచున్న స్మృతులే యీక్రిందగన బరచిన వివాహమంత్రముల ననుసరించి యున్నవి. కావున ప్రథమకక్ష్యలోని వచనములు ముఖ్యప్రమాణములుగా గ్ర హింపదగినవి కావని చదువరులకు బోధపడగలదు.

వివాహములో ప్రధానహోమమునందు సప్తపదికి పూర్వము "చంద్రుడు మొదటివాడై పొందినాడు, గంధర్వుడు రెండవవాడై పొందినాడు. అగ్నిమూడవవాడై భర్తయయి నాడు. నాల్గవవాడై మనుష్యుడు భర్తయగుచున్నాడు. చం ద్రుడు గంధర్వునికొరకును, గంధర్వుడగ్నికొరకును, ఆయగ్ని ధనమును, బుత్రులను యీవధువును నాకొరకిచ్చినాడు'' అను నర్థమును ''సోమః ప్రథమోవివిదే'' ఇత్యాది మంత్రము జెప్పుచున్నది. ''యోగ్యమయిన సంతానముకొరకు నీహస్త మును గ్రహించుచున్నాను.'' అను నర్థమును ''గృహ్ణామి తే సుప్రజాస్త్వాయహస్తం'' ఇత్యాది మంత్రము జెప్పుచున్నది. వివాహములో నాల్గవనాటిరాత్రి సమావేశనమను కర్మజరుప

బడును. అపుడు "ఊరువుపై గూర్చుండుము. బాహువును జాచి మంచి మనస్సుకలవాడవై నీభార్యను కౌగలించుకొ నుము. అనునీయర్థమును "ఆరోహోరుముపబర్హస్వ బాహుం" ఇత్యాదిమంత్రము చెప్పుచున్నది.

"నీభర్తయొక్క శిరస్సుపై నుండుము. సంతానము చే యజమానురాలవగుము. అత్త, మామ, అడుబిడ్డ, మఱది మొదలగు వారిపై నధికారముకలదానవు కమ్ము. అనునీయర్థ మును కన్యకకు తల్లి దండ్రులు మొదలగువారుచేయునుపదేశ ముగా "మూర్ధానంపత్యురారోహ" ఇత్యాది మంత్రము చెప్పుచున్నది. ఇంకి ననేక మంత్రములు ఋతుమతులయిన కన్య కలకే వివాహమును బోధించుచున్నది. గ్రంథవిస్తరభీతిచే వాని నన్నిటిని వ్రాయలేదు. పైమంత్రార్థములను విచారించి చూడగా రజస్వలా వివాహమేముఖ్యముగా విధించబడి యున్న ట్లు స్పష్టమగుచున్నది. ఇంతియ కాక "మనుర్వై యత్కించి దవదత్తద్భేషజం" అనుశ్రుతియును. శ్లో॥ వేదార్థోపనిబంధృత్వా త్ప్రాధాన్యంహిమనోస్స్మృతం। మన్వర్థ విపరీతాయాసాస్మృ తిర్నైవశస్యతే" అనువచనమును మనుస్మృతియే ప్రమాణ తమమని చెప్పుచున్నందునను, అట్టి మనుస్మృతి ఋతుమ తులయిన కన్యకలకు వివాహమును చెప్పుచున్న, వివాహ మంత్రార్థముల ననుసరించి యున్నందునను, శ్రుతి స్మృతి సమ్మతమయిన రజస్వలావివాహమే కర్తవ్యమనుటలో సం దేహము లేదని విమర్శకులకు దోచకమానదు. వివాహమం త్రములకును, ఆమంత్రముల ననుసరించిన మనుస్మృతికిని విరు ద్ధముగా ననంకురితయావనులయిన కన్యలకు వివాహములను

రోధించు వసిష్ఠాదిస్మృతులు గ్రాహ్యములుగావనియు,స్పష్టము గనబడుచున్నది. మఱియును పై యభిప్రాయానుసారముగా మలబారు, కాశ్మీరము మొదలగుదేశములలో శిష్టులగు బ్రాహ్మణుల కుటుంబములలో ఋతుమతులయిన కన్యకలకు వివాహములు చేయుట ఈ కాలమందుగూడ నాచారసిద్ధమయి యున్నది. కాబట్టి ప్రస్తుతిపుశిష్టాచారమును బట్టిగూడ రజస్వలావివాహమే ముఖ్యమని తెలియదగి యున్నది.

"సోమః ప్రథమోవివిదేగంధర్వో వివిదఉత్తరః
తృతీయో అగ్నిస్తే పతిస్తురీయస్తే మనుష్యజాః"

వివాహోత్పూర్వము కన్యకకు చంద్రుడు, గంధర్వుడు, అగ్నియు వరుసగా భర్తలగుదురని ఈమంత్రమువలన దెలియ వచ్చుచున్నది. చంద్రగోళము యెట్లు భర్తయయ్యెనో, గంధర్వులనేకులుండగ నొక గంధర్వుడు మాత్రమే యాయాడు బిడ్డకు భర్తయెట్లయ్యెనో ఆమీద పంచభూతములలో నొకటియగు నగ్ని యామెనెట్లుస్వీకరించునో ఇదినిందుగ నసంబద్ధముగనున్నది. అయితే మంత్రమిట్లు చెప్పుచున్నప్పుడిందుకు వేరొక భావముండకతీరదు. అదియెట్లనిన—ఒకకన్యకకు బాల్యావస్థదాటినపిదప నాకిన్య నెలనెలకు వ్యత్యాసము కనబడు నట్లు పెరుగుచుండును. అందువలన చంద్రుడు శుక్లపక్షములో దినదినమునకు బొందునభివృద్ధినిబట్టి యిది చంద్రుని మహిమ యని పూర్వులు తలచియుందురు. ఇట్లు కొంతకాలము పెరిగిన పిదప నందమభివృద్ధినొందుచుండును. గంధర్వులు సుందరులని మనకు గలనమ్మికనుబట్టి యిది గంధర్వుని కటాక్షమువలన నంద మెక్కుచున్నదని భావించియుందురు. అటుమీద రజస్వలకాక

పూర్వము శరీరమందు యౌవనసంబంధమయిన ఉష్ణిమ హెచ్చు చుండును. వేడిమియంతయు నగ్నిసంబంధమగుటవలన నగ్నిపతి యయియుండెనని తలచియుందురు. అంతియకాని పై ముగ్గురును వరుసగ భర్తలెట్లగుదురు. వారిని దేవతలక్రింద దీసికొన్నను, మానవకన్యను వారెట్లు స్వీకరింతురు. ఒకదానిని యెట్లోస్వీక రించి రనుకొన్నను ప్రతిమానవకన్యకు నెట్లు భర్తలగుదురు. అట్లయినచో వారి కెందరుభార్యలు. దేవతలుగూడ నొకరు పరిగ్రహించినదాని నింకొకరు పరిగ్రహింతురా. ఇంతియగాక ఒకకన్యకకు భర్తలని తీసికొందుమంటిమా ఆయింటిలోని యా డువారికందరికిని అనగా నాకన్య తల్లికిని అట్లనే యాపెకుమా త్రెలకును నామెకుమాత్రెకును నిట్లా కుటుంబములోని స్త్రీలం దరికిని యీముప్పురేభర్తలు కావలసివచ్చును. కావున పై మం త్రమునకు మీదవ్రాసిన యభిప్రాయమునే తీసికొనవలెను గాని సోమగంధర్వాగ్నులు భర్తలని తీసికొనరాదు. దీనినిబట్టి చూచినను రజస్వలానంతర వివాహమే శాస్త్రసమ్మతమనితో చకమానదు. పై నిర్వాయబడిన ప్రమాణములవలనను, యుక్తు లవలనను, నాచారమువలనను రజస్వలానంతర వివాహము బ్రాహ్మణులకుగూడ నంగీకరించుట కాక్షేపము లేదు. బ్రాహ్మ ణులను బోషించుచుక్షత్రియరాజులలోను, నితరరాజులలోను రజ స్వలా వివాహములు దూష్యముగాని యపుడు, వారిపోషకుల మంచి యాచారములనే బ్రాహ్మణులుమాత్రమేల గ్రహింప గూడదు ఇంతియగాక మనహిందువులలో నూటికి తొంబది తొమ్మిదిమంది రజస్వలావివాహములను నిరాక్షేపముగ జేయు చున్నారు. బ్రాహ్మణులలో నీయాచారమెందువలన బుట్టియుం

డుననగా వీరికి విద్యాపూ _ర్తిచేసికొనువరకు 30 సంవత్సరములు మించియుండును. అప్పటికి వెంౖడుకలు నెరయనారంభించును. అట్టివానిని రజస్వలయయిన స్త్రీజ్ఞానముకలది యగుటచే వివాహమాడుటకు నిరాకరించును. అందునుబట్టి జ్ఞానోత్ప _త్తికి బూర్వమయినంగాని యట్టివారిని స్త్రీలు వివాహమాడరని యెనిమిది సంవత్సరములుగల కన్యకకు వివాహముచేయుమని ఇటీవలన నేర్పరచికొనియుందురు. పాపమిప్పటి బ్రాహ్మణులలో గొందరు నెలలపిల్లలకుగూడ ధనాశచే వివాహములు చేయు చున్నారు. కావున నిటుపయిని మనహిందువులందరు రజస్వలానంతర వివాహములను జరుపుటకు నిర్ణయించుటకయి కోరు చున్నాను.

---

## వితంతువివాహము.

పైని చెప్పిన ప్రకారము శాస్త్రవిరోధములేని రజస్వలా వివాహములు జరిగినచో వితంతువివాహ ప్రసక్తి విశేషముగ నుండదు. విధవావివాహము గూడుననికొన్ని ధర్మశాస్త్రవచనములు శ్రుతులునుండినను ఆ యాచారము చాలకాలముగ మన హిందువులలోని నాలుగు వర్ణములవారిలో నిలిచిపోయి యుండును. హీనజాతివారిలో మారుమనువు ఆచారముగలదు. వారిలోనును దైవపితృకార్యములయందామారుమనువుదాసి చేత వంటలు, నారాధనలు చేయనీయరు. క్రిష్టియన్ మహమ్మదీయ స్త్రీలలోగూడ రెండవభర్తను పొందనిదానికి గౌరవముగలదు. అయినను రెండవభర్తను గోరుస్త్రీని సమాన

జాతులలోనివారు వివాహమాడుటయందు తప్పుగానరాదు. అట్టివారిని వారివారిజాతులనుండి బహిష్కరించక దేవపితృకార్యములయందు తప్ప ఇతరవిషయములలో మాత్రము సమానముగ జూచుకొనవలెను.

---

## వితంతు కేశఖండనము.

బ్రాహ్మణులలో గొందరు స్త్రీలకు వైధవ్యము సంభవించినపుడు శిరోముండనము చేయించుటగలదు. ఈ ముండనమునకు ధర్మశాస్త్రములలో నెచ్చటను విధులు చెప్పబడియుండలేదు. ముండనమనునది శిక్షలలో నొకటియయియున్నది. ప్రారబ్ధవశమున భర్తృవియోగము నొందినదాని కీముండనశిక్షవిధించుట తప్పుగ గనపడుచున్నది. వైష్ణవులలోని తెనగలవారిలోను మఱికొన్ని శాఖలలోని యితరబ్రాహ్మణులలోను క్షత్రియాదులలోను నీదురాచారములేదు. ఈకాలమున ధనాపేక్షనుబట్టి పరునిశరీరారోగ్యమును వయస్సునుగమనింపక వివాహముచేసిన యజమానుల కీపని జరిగించినచో శిక్షగనుండును. ఇంతియగాక యితరపురుషసంపర్కమే స్త్రీకి గూడదని చెప్పబడినప్పుడు భర్త పోయినస్త్రీకి క్షౌరకుని సంపర్కమున కెట్లు లంగీకరింపవచ్చును.

విధవలగుస్త్రీలు ముండనమువలన వికారముగనుండి పరపురుషసంపర్కమున కనర్హులయి యుందురని యోచించినచో యుక్తప్రవర్తనముగల వారికిని ఋతునివృత్తియయిన వారికిని ముండనమేల చేయింపవలెను? వాడుకనుబట్టి చూచి

నను జారిణులగు విధవలకీముండనము వలన లేశమైననాటంక మున్నట్లు కానరాదు. ఏవిధముగ యోచించిననువిధవలకు ముండనకర్మ జరిగించుట తప్పు అయియున్నది. కావున నిటుపయుని విధవలకు ముండనము చేయించకుండుటకు మిమ్ములను గోరుచున్నాడను. మఱియొకసంగతి చెప్పవలసియున్నది.

---

## సత్యము.

మనహిందువులలో సాధారణముగ నబద్ధము లాడుట కలదు. ఇందుకు శ్రీకృష్ణులువారు శ్లో॥ వివాహకాలేరతి సంప్రయోగే ప్రాణాత్యయె సర్వధనాపహారే। విప్రస్యచార్థే హ్యనృతంవదేతపంచానృతాన్యాహురపాతకాని॥ అని మహాభారతమున కర్ణపర్వములో నొకసందర్భమున నర్జునున కానతిచ్చిన శ్లోకము నాధారముగ జేసికొని యాసమయములను బాగుగ బోధకు తెచ్చికొనక యాయయిదింటికి నేమాత్రము సంబంధించి యున్న పనులన్నిటియందును జడియక యబద్ధములాడుచున్నారు. శ్రీకృష్ణులవారు సెలవిచ్చినదేమనగా:—

1 వివాహకాలమందును
2 సంభోగకాలమందును
3 ప్రాణసంరక్షణముకొరకును
4 ఒకనియొక్క సర్వస్వముపోయినప్పుడును
5 బ్రాహ్మణుని గాపాడుటకును

చెప్పబడు నసృతమునందు బాతిత్యము లేదని సెలవిచ్చిరి. ఈయయిదు విషయముల నవకాశము గలుగజేసి

కొని మనహిందువులు అందులో ముఖ్యముగ బ్రాహ్మణులు తమకు పాతిత్యము సంభవించునటులను నితరులకు హానికలుగునటులను నన్నృతము నాడుచున్నారు. కావున నీయయిదు సమయములందును గనిపెట్టవలసిన కట్టుబాటులను వివరించి చెప్పబోవు చున్నాను.

1. వివాహసమయమం దనగా నేదైన యొకదైవిక ముగు నాపదసంభవించి దానిచే గాబోవు వివాహమాటంక పరుపబడు నెడల నప్పు డనృతమాడుటలో బాతిత్యము లేదు. అట్లుకానిచో నప్పుడు చెప్పబడు సత్యమిరుపార్శ్వముల వారికిని విశేషముగ ద్రవ్యహానినిగలుగ జేయుటయెగాక యావివాహమునకు బిలువబడినవారికిగూడ మిగుల ననదుపాయము సంభవించును.

2. సంభోగకాలమందు భార్యాభర్తలయొక్క గాని అట్టి వారియొక్కగాని సంభాషణము లాహ్లాదకరముగను, చమత్కార యుక్తముగను, వినోదముతో నిండినవిగాను నుండవలసి యుండును. కావున నట్టి సంభాషణములలో నన్నృతమాడిన యెడల నది సౌఖ్యమును, నానందమును నభివృద్ధిపరచునే కాని యాయిరువురిలో నొకరికిని హానినిగలుగ జేయదు.

3. ప్రాణసంరక్షణ మనగా నిరపరాధియొక్క ప్రాణమును రక్షించుటయని తెలిసికొనవలెను.

4. ఒకనియొక్క సర్వస్వముచెడుట:—అనగా నట్టియుపద్రవముగలిగినపు డనృతమాడుట వలన బాతిత్యములేదు.

ట్లుగానిచో శ్రీకృష్ణులవారు సెలవిచ్చిన సత్యవ్రతుడను
ుపికథలోని బాటసారులయొక్కయు,దొంగలయొక్కయువిధ
ునచే నిరపరాధులు విశేష నాశమొందుటయు, దుర్మార్గ
ందువలన మేలునొందుటయు సంభవించును.

5. ఎప్పుడైన నొకప్పుడు ప్రమాదముగగాని విధిలేక
గాని జరిగించిన దానిని బయట బెట్టుటచే బ్రాహ్మణుడు జాతి
భ్రష్టుడగుతెరి నాతనినట్టి యవస్థనుండి కాపాడుటకుగాను
సత్యమును జెప్పవచ్చును. తదితర జాతీయుడు జాతికి చెడిన
పుడు తనక్రిందిసమీపజాతిలో గలియగలడుగాని బ్రాహ్మణు
ుజాతికి చెడినపుడు చండాలుడేయగునని ముఖ్యముగ బూర్వ
కాలమున నిశ్చయింపబడి యుండెను. కావున బ్రాహ్మణుడెప్పు
డైన బ్రమాదముచే గాని విధిలేకగాని యట్టియవస్థ తటస్థించి
తద్ద్వారాయతడు చండాలత్వమును బొందకుండుటకయి యనృ
తమాడుటచే బాతిత్యములేదు.

మఱియు శ్రీకృష్ణులవారు సెలవిచ్చిన దేమనిన "పుణ్యా
పవిచక్షణ కొకవిధమైన పరిజ్ఞానము ఉండవలెను. గొప్ప
దైనదియు దెలియశక్యముగానిదియు, నొకప్పుడు కారణమును
యోచింపగా దెలిసికొనబడును.

అనేకులు వేదశాస్త్రములే నీతిజెప్పు ననియెదరు.
వానిని నే నాక్షేపింపనుగాని వేదశాస్త్రములు ప్రతివిషయమును
గలిగియుండవు. జీవులయభివృద్ధికొరకు నీతివాక్యములు జెప్ప
బడియున్నవి. "హింసారహితమైన వానితో సంబంధించినది
నీతియె" కావున మనమతివిచక్షణతో సంగతిసందర్భములను

గమనించి సాధ్యమయినంతవరకు అనృతమాడకుండనుండవలెను.

ప్రస్తుతము చర్చింపబడుచున్న సంస్కరణవిషయములలో ముఖ్యములయిన కొన్ని విషయములను మాత్రము వివర్శించి శాస్త్రదూష్యము కాకుండునట్లు చూచుకొని నాయప్రాయమును దెలుపుకొంటిని. ఈనాయుపన్యాసములో యంశములను బాగుగ యోచించుకొని సంచరించుటకై మిమ్మును గోరుచున్నాడను.

